# రాటపు సందేశము

(సరళాదేవి చౌదురాణిచే వ్రాయబడినది.)

ఉపేంద్రప్రచురణాలయము

౧౭, నారాయణ మొదలివీథి,

చెన్నపురి.

# ఒక మాట.

అదృష్టమువలననో, దురదృష్టమ్మువలననో, లేక యీ రెంటివలననో యీనాటికి ప్రభుత్వమునందు మంత్రిపదవి ననుభవించుచున్న శ్రీయుత కూర్మా వేంకటరెడ్డినాయుడుగారు ఇటీవల కొన్ని యుపన్యాసముల గావించుచు రాట్నములపై నూలువడకుట, ఆనూలుచే నేయబడిన వస్త్రములను ధరించుట మొదలుగాగలవి వెఱ్ఱికార్యములనియు, లాభములేని పనులనియు చెప్పియున్నారు. చిత్తము. అయినను కానిండు. అయ్యది ప్రజానుమోదమును బడసినది. ఆపిచ్చికార్యములనే యనేకులు చేయుచున్నారు. ఒకపరి మనమంత్రివర్యులు ఆంధ్రదేశమునంగల గ్రామములకు వెళ్ళిరేని యచ్చట ప్రజలెట్లు సంతసముతోడను పట్టుదలతోడను యాపిచ్చికార్యముల జేయుచున్నారో తెలియగలదు. వీరేల యూరకుండక యిట్టి వృధాప్రయాసలకు లోనగుటయో ఎఱుకరాకున్నది. వీరును ఇంకయు నిట్టి సందేహముగలవారును మహాత్ముని సందేశమును గ్రహించి తమతమ సందేహములను బాపుకొనుటకయి, ఎల్లవేళల ముతకవస్త్రములనే ధరించుచు దేశసేవాపరాయణులగు శ్రీమతి సరళాదేవి చౌదురాణి గారిచే నివ్వబడిన ఈయుపన్యాసమును చదివిన బాగుండునని నమ్ముచున్నాను.

౧౦—౪—౧౯౨౧
చెన్నపురి.

గోనుగుంట్ల వేంకటసుబ్రహ్మణ్యం.

# భారతీయుడా నూలువడకుము.

గాంధిమహాత్ముడు గుజరాతుజాతీయకళాశాలా విద్యార్థులను ఒక్క సంవత్సరమువఱకు తమ విద్యాభ్యాసమును మాని ప్రతిదినము నారుఘంటలకాలము నూలువడకుడని చెప్పిన పల్కులవిన్నదానను. ఆతడు వంగీయవిద్యార్థులకు చేసిన యుపదేశసారమును సయితము చదివినదానను. ఆ పల్కుల యదార్థమును నాకు గోచరమయిన విధమున తమలో నొక తెనగు నేను మీకెఱిగింపదలచినాను.

రాజ్యాభిలాషచే దండెత్తివచ్చిన అలెగ్జాండరు, నెపోలియను మున్నగు వీరులవలె బ్రిటీషువారీదేశమునకు రాలేదు. వారు కేవలము వ్యాపారమునకై యీదేశమునకు వర్తకులవలె వచ్చిరి. వారి యుద్దేశము హిందూదేశమున సామ్రాజ్యమును స్థాపించుటగాదు. ఈదేశపు వృత్తులను నశింపజేయుటయే వారి ముఖ్యోద్దేశము. రాట్నములవృత్తి భస్మీపటలముచేసి యాభస్మరాసులపై బ్రిటీషు సామ్రాజ్యలక్ష్మి నధిష్ఠింపజేసిరి. వాటిపై హిందూదేశమునందు బ్రిటీషు సామ్రాజ్యమునకు పునాదులవైచిరి.

ఇంగ్లాండునందు నెలకొల్పబడిన కర్మాగారముల పోషణార్థమును, ఆకర్మాగారముల భాగస్వాములకు విశేషలాభములు లభించుటకును, అతిసున్నితమగు రాటములవృత్తి ని

పాడుచేసిన దీయాంగ్లేయవర్తకులే. ప్రతి హైందవుని గృహాంతరమునందశాంతిని నెలకొల్పి పేదఱికమును, క్షుద్బాధను, పెంపొందించి దారిద్ర్యదేవతను ప్రతిష్ఠజేసిన దీయాంగ్లవర్తకులే. వంగదేశపు సాలీలతోడ పోటీయందు నిలువజాలక యన్యాయపుమార్గముల వారిని యణగద్రొక్కిరని యాంగ్లేయ చరిత్రకారుడే నుడువుచున్నాడు. వీరి యన్యాయపు పన్నుగడలే సర్వస్వాతంత్ర్యభారతదేశమున కవసాన కాలమును తెచ్చిపెట్టినది.

ఇంకయు నెట్టిదుండగముల నొనరించిరో చూచెదము !

రానురాను ఇంగ్లాండుమొదలుగాగల దేశములందధిక లాభములతో యమ్ముటకు వీలగుచుండిన ప్రత్తి, పట్టు, వస్త్రముల నింగ్లాండునం దమ్మకుండ జేయుటయే వారి వాణిజ్యపు విధానమాయెను. ఇట్లు హిందూదేశపు వస్తువులను ఇంగ్లాండుదేశమున యమ్మకము చేయుటకు వీలుకాక పోవుట వలనను, వాటిపై యధికమగు పన్నులు విధింపబడుట చేతను ఇంగ్లీషువస్తువులు పోషింపబడుచుండెడివి. అట్టి బంధములు లేకయే యుండినచో మాన్చెస్టరు, పైస్లీ మున్నగు ప్రదేశములయందు కర్మాగారముల నెలకొల్పుటకు వీలుకాక పోయెడిది. ఆవిరియంత్రసృష్టి అనంతరము సయిత మాకర్మాగారముల నెలకొల్పి విశేషలాభముల ననుభవించుచు నిర్వహించుట బహు కష్టముగ నుండెడిది. హిందూదేశమునందలి వృత్తులనశింపే వాటి యభివృద్ధికి దోహదము నొసంగినది. హిందూదేశమే సర్వస్వాతంత్ర్యదేశమై యుండినచో నయ్యది

బదులుకు బదులుగ ఆంగ్ల దేశపు వస్తువులపై దిగుమతి పన్నుల విధించి తనవృత్తులను రక్షించుకొనెడిది. అప్పుడు తనవృత్తులు నశింపక వృద్ధియందుండెడివి. స్వవృత్తి రక్షణమున కవకాశమే లేకపోయెను.

ఆంగ్ల దేశపు టార్థికవేత్తలు స్వేచ్ఛా వాణిజ్యావశ్యకతను ౧౮-వ శతాబ్దమునుండి నొక్కి చెప్పుచుండిరే కాని హిందూదేశమునందుగల వృత్తులు నశించువఱకును, వారి దేశమునందు పారిశ్రామికాభివృద్ధి తృప్తికరమగు రూపము దాల్చువఱకును, స్వేచ్ఛావాణిజ్య విధానము నమలునందుంచుట కియ్యకొనరైరి. వారి వృత్తులకు బలమగు పునాదులవైచి తదనంతరము మిగిలిన రాజ్యములవారిని స్వేచ్ఛా వాణిజ్య విధానము నవలంబింప ప్రేరేపణ గావించిరి. మిగత రాజ్యముల వారు వీరి కుట్రల బాగుగ నెఱింగినవారు. అందుచే బ్రిటీషు వలస రాజ్యములవారు తమ పారిశ్రామికాభివృద్ధినే యాదర్శముగ నుంచుకొని రక్షిత వాణిజ్యవిధానము నవలంబించి తమ తమ పరిశ్రమల పోషించుచు వచ్చిరి. హిందూదేశమునకో యట్లు కాదు. ఈదేశపాలకులు ఈదేశమునందుండిన వృత్తులడుగంటు దనుక పరదేశవస్తువులను సంరక్షించుచుండిరి. తదనంతరము స్వేచ్ఛావాణిజ్య విధానము నవలంబించి హిందూదేశ పరిశ్రమలు పునర్జన్మమెత్తకుండునటుల కట్టుదిట్టముల గావించిరి.

నేతగాండ్రు నశించిన మఱుదినమే కృషికులు నశింప నారంభించిరి. అనేకులు రెంటియందును ప్రవేశముగలవారై

యుండిరి. శిస్తు లత్యధికములగుటచే కృషీవలుడు భరియింప రాని దశకువచ్చి పేదఱికము ననుభవింపవలసిన గతిపట్టెను. ఇంతియగాక నూతనముగ నిర్మింపబడిన రయిలుమార్గములు బయిలుదేఱెను. ఇవి విదేశీయుల పెట్టుబడులకు లోనగుటచే వారల కధికముగ వడ్డీల నివ్వవలసివచ్చెను. ఈయంత్రములు నూర్లు కొలది, వేలకొలది పడవల నడపువారియొక్కయు, బండ్లు నడపించి జీవించువారియొక్కయు, రెండు ఎద్దులనుంచుకొని వాని మూలముగ నాలుగుడబ్బుల సంపాదించి పొట్టబోసికొనుచుండిన వారియొక్కయు జీవనములకు మారణయంత్రములాయెను. ప్రపంచములోనికెల్ల గంగానదిపై జఱుగు పడవ వ్యాపారము మఱియేనదిపైనను జఱుగుట లేదని ఆంగ్లేయులే వాక్రుచ్చియున్నారు. ౧౭౮౦ సం॥ ప్రాంతములలో సుమారు ౩౦ వేల పడవవాండ్రు జీవనము చేయుచుండిరి. అప్పటినుండియు వారిసంఖ్య యినుమడించియే యుండును. గంగానదిపై ఎల్ల కాలము విధివిరామములేక నడచుచుండిన పడవల సమూహములనుచూచి యానందింపని విదేశీయుడు లేనేలేడు. గంగానది చుట్టుపట్ల యనేకు లీగంగానదివలన జీవితముల నేర్పఱచుకొని యుండిరి. అయ్యది అంతటి పరమసేవ్యమై వాణిజ్యముచేయు వారలకును, యాత్రలు సలుపువారలకును హాయినిచ్చుచుండెను. అయిననేమి? ఆంగ్లేయప్రభుత్వమువారు రయిళ్ళవేయు కంపినీలవారికేలాటి నష్టములు గలుగకుండ వారలకు ప్రభుత్వపుటాదాయములనుండి కొంత ధనమిచ్చుటకు నొప్పుకొని

విదేశీయవర్తకులను పోషించుచు వచ్చుటచే యనేకులకు ప్రాణాధారమగు మార్గము నశించెను.

హిందూదేశమున రాజప్రతినిధిగనుండిన యాంగ్లేయుడొకడిట్లు నుడివెను. "ఇదివఱలో కొండఱి నిరంకుశత్వమునకు వంగదేశీయులు లోను గావలసివచ్చియుండెను. ప్రతిగ్రామమునకున్ను, ప్రతిగృహమునకును వ్యాపించిన యీబీదతనమునకు కారణమగునట్టి దురాశాపీడితు లగు యాంగ్లేయవర్తకుల యన్యాయపు కట్టుబడుల కెన్నడును పాపమావంగీయులు లోబడ లేదు. ఏరాజో పొగరుబోతుతనమువలన చేసిన దుండగములకు పాల్పడిరేమొ కాని యిట్టి యన్యాయపు వాణిజ్య విధానమునకులోబడి వారివ్యాపారమును, వారిజీవనమును పోగొట్టుకొనినది లేదు. వీరు హిందూదేశమునందడుగిడిన నాటినుండియు వారివృత్తులు విగతజీవములు కలవియాయెను. వారి ధనార్జనా మార్గములు నశించెను."

పై వాక్యములెంతయు సత్యములని వేఱు చెప్ప నక్కఱ లేదు. హైందవులలో యనేకులు వారివృత్తులు నశించుటచే జీవనోపాదిగాన లేకపోయిరి. వారియందు దారిద్రదేవత స్థిరస్థాయియయినది. తుదకు దేశమునందొక్కచోట పంటలు ఫలించకపోయినను కరవుప్రవేశించుటయు అందుమూలమున యనేకులు పట్టెడన్నమైనలేక చావవలసిన గతిపట్టుచున్నది. ఇవన్నియు విదేశీయరాజ్యాంగపాలనకు లోబడియుండుట వలన కలిగిన లాభములని చెప్పవచ్చును. ముఖ్యముగ వారివృత్తులు

నశించుటచే వారెట్టిదుస్థితి ననుభవించుచున్నదియు గోచర మగుచున్నది.

హైందవుల పారిశ్రామికాబలము వారిమగ్గముల యభివృద్ధియందు మాత్రమేలేదు. వారి సంపూర్ణబలము వారి రాట్నములయందే కలదు. ఏలనన యీదినమునను ఢక్కా-మున్నగు నేత పరిశ్రమలు జరుగుచుండిన ప్రదేశములయందు, విదేశపునూలుతో నేతపని జరుగుచునే యున్నది. నూలు స్వదేశమునందు తగ్గుటంబట్టియే జపాను దేశపు నూలును వాడ వలసివచ్చినది. పూర్వము చేతితోవడకబడిన నూలే హైందవులకు స్వేచ్ఛా సుఖజీవనములనిచ్చి వారిని పోషించినది. మరల నేటిదినమున యాచేతిరాట్నపునూలే మనకు స్వేచ్ఛా మార్గమును జూపునది. అయ్యదియే మనలకు సుఖజీవనము నిచ్చునది. మనసిపాయీలు మున్నగువారలు వారిపూర్వపు వృత్తిని తెలిసియో తెలియకనో మానివేసిరి. వారు ఇప్పుడయినను తమవృత్తుల నభివృద్ధిచేసికొననిండు. చేతిరాట్నములపై వడకబడిన నూలును యుపయోగించుటవలనను ముతకబట్టలను ధరించుటవలనను మనము మనవాణిజ్యమును పోషింపవచ్చును. మనదేశమున యక్రమముగను యన్యాయముగను పాలించు బ్రిటీషువారి యక్రమములనడగించున దీరాట్నమే. ఈ విదేశీయవర్తకులవలన నశింపుగాంచిన యావృత్తిని నెలకొల్పి హైందవుని గృహజీవనమునందు కొన్ని మార్పులగల్పించి చేతిరాట్నములపై తీయబడిననూలుచే తయారగువస్త్రముల ప్రతి

హైందవుఁడును ధరించునట్లు చేయుటయే హైందవస్వారాజ్య ప్రాప్తికి ముఖ్యసూత్రము.

ఆహా! ఏమి యీకాలమునకు హిందూదేశమునందు కనుల మిఱుమిట్లు గొలుపు నానావిధరంగుల బట్టలు కానవచ్చుచున్నవే కాని అందు ఒక్కఁదాని నయినను చూపి, ఇయది మన్నది, ఇది మాదేశమున నేయబడిన వస్త్రమని చెప్పుటకు రాకున్నదే! దపూర్వమో ప్రపంచమున కంతటికిని మనమే వస్త్రముల నంపుచుండెడివారము. అట్టి యున్నతస్థితి ననుభవించిన భారతభూమి యీనాటికి దారిద్ర్యదేవతకు నివాస భూమియై విదేశీయ వస్త్రములపై యాధారపడవలసిన స్థితి సంభవించినది. ప్రభుత్వమువారును, వారి వింత వింత శాసనములును భారతమును పాడుచేయ జూచుచున్నవి. అయిన నేమి కాలము మించిపోలేదు. భారతమాతను రక్షించుటకు అవకాశములు పెక్కులుకలవు. హైందవులు సుదర్శనచక్రమునందు నమ్మకముంచిన చాలును. ఈచక్రమే శ్రీకృష్ణుని యస్త్రమై మన దేశము నధోగతినుండి మఱల్చగలదు. ఇయ్యదియే భారత సౌభాగ్యలక్ష్మి కదృష్ట చక్రమగును.

దేశమునందుండు వారెల్లరును ఎన్నఁడో నశించిన వృత్తిని యభ్యసింపవలసిన యవసరమేమివచ్చినది? ఆవృత్తి యందున్నవారు మాత్రమట్లుచేసిన చాలదాయని ప్రశ్న వేయవచ్చును? అందులకు ప్రత్యుత్తరమేమన విదేశములనుండి వచ్చు నూలునకు బదులు మనచేతినూలు నుపయోగించుటయే కాదు. ఇదివఱలో మనమెల్లఱము చేసిన పాపనివార

ణాకై మనమెల్లఱము రాట్నములపై నూలు వడకవలసి యున్నది. మనల నిట్టిస్థితికి గొనితెచ్చిన ఇంగ్లీషుప్రభుత్వము వారి దుండగములకు బలమునొసంగి వారికి సహాయము చేసి నది మనపూర్వీకులే. వారిసహాయము లేకుండిన వీరణుమాత్ర మేనియు యీదేశమునం దడుగిడుటకు వీలుకాకపోయెడిది. మనవారే పూర్వము మనదేశమునకెట్లు అన్యాయమగు కార్య ములజేసిరో యొకయాంగ్లేయుని వాక్యములవలన గోచరము కాగలదు. ఈదేశమునందిప్పుడు జఱుగుచున్న వ్యాపారమును, విదేశవర్తకులకు లాభములువచ్చు నిమిత్తమీదేశమున పెట్ట బడిన పెట్టుబడులు యివన్నియు యన్యాయపు మార్గములవలన కలిగినదే. ఆ●లమున దేశమునందు తయారుచేయబడు ప్రతి వస్తువును ఆంగ్లేయవర్తకులే బేరము చేయుచుండిరి. ఆంగ్లేయ వర్తకులయొద్ద పనిచేయుచుండిన నల్లగుమాస్తాలును, వర్తకపు దలాలీలునుకలసి సాలీల ననేకవిధముల హింసించుచు వచ్చు చుండిరి. వారెంతసరుకు ఏధర కివ్వవలసినదియు నిర్ణయించు చుండిరి. అందువలన ప్రతిసాలెవాడును నశింపవలసివచ్చెను. .........ఈకంపెనీ గుమాస్తాలు నేతపరిశ్రమలు జఱుగుస్థల ములకువెళ్లి వ్యాపారమునకొకచోటును నిర్మించుకొని యచ్చ టికి ధలాలీలను సాలీలను పిలిపించెడివారు. వారు వచ్చిన వెంటనే "మీరు ఫలానావాయిదాకు ఫలానాధరకు మాకు యింతసరుకు యివ్వవలసిన"దని జట్టీలు బేరములాడువారు. సా లీలు ఒప్పుకొన్నను సరె ఒప్పుకొనక పోయినను సరె ధలాలీలు వారిని నిర్బంధించి వారిని యీజట్టీల కొప్పుకొనునట్లు చేసి వారి

వద్ద చేవ్రాళ్లపుచ్చుకొని పంపివేసెడివారు. అందులకుతగు బయానాసొమ్ము సాలీల కిచ్చుచుండిరి. వారద్దానిని పుచ్చుకొనకున్నను వారిని కొరడాతో రెండుదెబ్బలుకొట్టి బయానాను వారిమడియందు కట్టియుంచి పంపివేయుచుండిరి. పాపమాసాలీల కేమి తెలియును. వా రమాయకులు. సత్యమునకు కట్టుబడెడివారు........కొందఱు గుమాస్తాలు సాలీలనామములను తమపుస్తకములలోని కెక్కించుకొని వారు తయారుచేయు వస్త్రములనన్నింటిని తమకే యిచ్చుచుండవలసినదని నిర్బంధించుచుండిరి. ఒక గుమాస్తా పుస్తకమునుండి మఱియొక గుమాస్తా పుస్తకమునకు వీరినామములు మాఱుచుండెను. వారట్లు నిర్బంధింపబడుచుండిరి. తుదకు వారు స్వేచ్ఛగలవారయి వర్తించుటకు వీలులేక కంపెనివారి గుమాస్తాలకు బానిసలయి యుండునట్టిస్థితికి వారిని తెచ్చిపెట్టినదీ నల్లగుమాస్తాలే. ......ఈ విషయములయందు జఱుగుచుండిన యన్యాయమింతింతయని చెప్పనలవికాదు. ఎన్ని చేసినను పాపమాసాలీలే పాడగుచుండిరి. ఏలనన ఈగుమాస్తాలును బట్టల విలువకట్టువారునుకలసి నూటికి ౧౫ వంతున ధరలను తగ్గించుచుండిరి. కొన్నిసమయములందు నూటికి ౪౦ వంతునను ధరలు తగ్గించుచుండిరి. సాలీలు నిరపరాధులయి వీరి యక్రమములకు లోబడియుండిరి. ఆసాలీలే తమచే తయారుకాబడిన వస్త్రములను బహిరంగముగ వర్తకుల కమ్ముకొనియుండిన వారలకెక్కుడు విక్రయము లభించియుండెడిది. విశేషలాభములననుభవించుచుండెడివారు......ఆసాలీలు నియమితకాలమునకు

జట్టీల నీయకపోయిరేని గుమాస్తాలు వీరివద్దయున్న వస్త్రము లను అమ్మి నష్టపరిహారార్థము ఆయమ్మకమును తీసికొనెడి వారు. ఇట్టికష్టములకు లోనంగుచుండెడివారు కావున గృహము లందు పట్టుదారమును కండెలకు పోయువారు ఆకష్టములకోర్వ జాలక తమ బొటనవ్రేళ్లను తెగగొట్టుకొనుచుండిరి. వారనుభ వించుచుండిన కష్టమంత మిక్కుటముగ నుండెడిది" వ్యవ సాయదారులు సయితమనేక యక్రమములకు లోనగుచుండిరి.

"రహితులు సయితము బట్టలు నేయుచుండిరి. వారు జట్టీల నివ్వకపోయినప్పుడు గుమాస్తాలు చేయుయక్రమములకు లోనగుటచే వారివద్ద తమభూముల సారవంతముగ జేసికొనుటకు చాలినంత ధనముండెడిదికాదు. భరింపరానంతగ విధింపబడిన పన్నులు చెల్లించుట కాకృషీవలుడు తనగొడ్ల నమ్ముకొనవలసి వచ్చుచుండెను. కొన్ని సమయములందు వారు వారి బిడ్డల సయిత మమ్ముకొనవలసిన దుస్థితి వచ్చుచుండెడిది. అదియు వీలు కాకున్నవారు పలాయితులగు చుండిరి." -

సముద్ర వ్యాపారమును చూచుచు ఎగుమతి దిగుమతి పన్నుల విధించు కష్టమాఫీసుయందు జరుగుచుండిన యక్రమ ములనుగురించి రాజప్రతినిధి యొకడు ఇంగ్లాండునకు వ్రాసి న లేఖవలన బోధపడగలదు.

"ప్రతివ్యాపారియు, తన స్వరక్షణమునకును, వాని యాస్తిని కాపాడుకొనుటకును, వాని యాలుబిడ్డలు భద్రముగ నుండుట కొరకును ఆతడు కష్టమాఫీసునందుండు ప్రభుత్వో ద్యోగీయులకు లంచము లాదిగాగలవియివ్వవలసి యుండెను..."

దేశముయొక్క సుఖజీవనమునకును ధన సంపత్తికిని కలుగుచుండిన నష్టమటుండ ఆంగ్లేయవర్తకుల యొక్కయు వారి గుమాస్తాలయొక్కయు నడవడికలు దేశీయుల ధర్మబుద్ధుల నాశనము గావించుచుండినవి. ఇట్టియన్యాయములను సాగనిచ్చు బంధములను మన మిప్పుడు త్రెంచివేయవలయును. రాట్నము యొక్క ప్రతిచుట్టునకును ఆబంధములందలి యొక్కొకపోగును భస్మీపటలము కావలయును. ఈచక్రమే శ్రీవిష్ణువుయొక్క చక్రాయుధమై ఏవిధమగునట్టి ప్రాణహానియు జఱుగనీయక, ఎట్టి దౌర్జన్యముల జఱుగనీయక, ఈయాంగ్లేయుల దుండగములనాపి వేయగలదు. అయ్యదియే ప్రభుత్వమువారి యొక్క పశుబల పూరితములగు ఫిరంగుల నతిసులభముగ నెదుర్కొనగలదు. ఈమార్గమే స్వధర్మ నిర్వాహణమార్గము. దీనివలననే మనము విశుద్ధ జీవితములు గలవారము కాగలము. మహోన్నతమగు యుద్యమమును నడుప యవతరించిన యీగాంధి మహాత్ముని యుపదేశములందు నాకు గోచరమయిన సారాంశమియ్యదియే.

---

ఇండియా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.
౬, సుంకురామ శెట్టివీథి, మదరాసు.

# మా ప్రచురిత గ్రంథ రాజములు.

హైందవస్వారాజ్యము: (గాంధిమహాత్ముని విరచితము)

గాంధి నడుపుచుండు మహోద్యమముల సూత్రము లిందు చక్కగ వివరింపబడి యున్నవి. నిజమగునా గరికలతృణము లిందు చక్కగ చెప్పబడియున్నవి. ప్రతి ఆంధ్రుడును చదివి తీరవలయును. - వెల అ ౯

హైందవజాతీయ పరిణామము:

ఇందు దేశీయ మహాసభయొక్క జన్మము వృద్ధి, పరిణామములును దానితో సమకాలికములగు నితర సమస్థల చరిత్రమును భారత జాతీయభావాంకురార్పణము మొదలు నేటిదనుక జరిగిన సర్వవిశేషములు ఎల్లరకు నర్థమగు రీతిని తేట తెలుగున కథవోలె హృదయంగమముగ వర్ణింపబడి యున్నది. శీఘ్రములో వెలువడును.

పుష్పాంజలి (శ్రీవాసంతికా గ్రంథమాలా ప్రథమకుసుమము)

ఆధునికకవివరరచిత భావగీతామతల్లికలు. గీతముల చదువుచున్న కృష్ణునిమురళీ గానమును వినుచున్నట్లేయుండును. అందలి మాటలు తేనియతేటలు. వాని నడకలు రాచహంస యొయ్యారములు. రండు! రండు! పుష్పాంజలిగైకొండు! మీకంఠంబుల కుసుమమంజరులతోడ నలంకరింపుడు. మీ మానసముల సుధాధారలలో నింపివేయుడు.

---

ఉపేంద్ర ప్రచురణాలయము

౧౭, నారాయణమొదలి వీధి, చెన్నపురి.